





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

## మన ధర్మం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034915

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మన ధర్మం

రేగులపాటి కిషన్‌రావు

విజయలక్ష్మి పబ్లికేషన్స్
చింతల్‌ఠాణం—505 405.
జిల్లా: కరీంనగర్, ఆంధ్రప్రదేశ్

మన ధర్మం
విజయలక్ష్మీ పబ్లికేషన్స్ ప్రచురణ నెం. 16
ప్రథమ ముద్రణ: జనవరి, 1997.



రేగులపాటి కిషన్‌రావు

| | | |
|---|---|---|
| పుట్టిన ఊరు: | చింతల్‌ఠాణం<br>ఇది కరీంనగర్ జిల్లాలోని<br>సిరిసిల్ల మండలములో ఉన్నది. | |
| తల్లి: | చంద్రమతి | |
| తండ్రి: | భూంరావు | |
| పుట్టిన రోజు: | 12వ జనవరి, | 1946 |
| విద్య: | హెచ్.ఎస్.సి. | 1965 |
| | ఎస్.జి.బి.టి. | 1968 |
| | ఇంటర్మీడియట్. | 1973 |
| | బి.ఏ. | 1990 |
| | ఎం.ఏ. | 1992 |
| | బి.ఇడి. | 1993 |

ఉపాధ్యాయ వృత్తి: 1970 నుండి

# 1. మన ధర్మం

సర్వ జనుల హితముకోరి
జీవించుట మనధర్మం
పలురకాల ప్రాణులను
ప్రేమించుట మనధర్మం.

దురాశలను నిరాశలను
తరుముటయే మనధర్మం
అంతులేని స్వార్థమ్మును
తరుచుటయే మనధర్మం.

సత్యమునే ఎల్లప్పుడు
మాటాడుట మన ధర్మం
అసత్యమును అనుక్షణం
వేటాడుట మన ధర్మం.

న్యాయమైన చట్టాలను
పాటించుట మనధర్మం
పనికిరాని చట్టాలను
మార్చుకొనుట మన ధర్మం.

పాతతరం ధర్మాలను
మార్చుకొనుట మనధర్మం
కొత్త నీతి సూత్రాలను
నేర్చుకొనుట మన ధర్మం.

## 2. విచిత్రం

ఎవరు చెప్పగలరూ మీలో ఎవరు చెప్పగలరూ?
ఎవరు చెప్పగలరూ చక్కగ ఎవరు చెప్పగలరూ?

గడ్డి పచ్చగా ఉండునెందుకని
గాలి కనబడక ఉండునెందుకని ॥ఎవరు॥

నార చీరుమని గూడుకట్టుమని
రెక్కలు ఊపుచు పైకి ఎగురుమని
ఎవరు నేర్పినారో పక్షికి ఎవరు నేర్పినారో ॥ఎవరు॥

రంగుల పువ్వులు పూసి ఇవ్వమని
ఫల పత్రాలను పంచిపెట్టుమని
ఎవరు చెప్పినారో చెట్లకు ఎవరు చెప్పినారో ॥ఎవరు॥

పెరిగి తరుగుమని తరిగి పెరుగుమని
దిక్కులు తిరుగుచు దీప్తి పంచుమని
ఎవరు చెప్పినారో శశికీ ఎవరు చెప్పినారో ॥ఎవరు॥

నింగి నిండుగా నక్షత్రాలను
ఎవరు నిలిపినారో అచ్చట ఎలా నిలిపినారో ॥ఎవరు॥

చక్కని చుక్కలు చిక్కని వెలుగును
ఎలా పంచగలవో నిత్యం ఎలా పంచగలవో ॥ఎవరు॥

ఆకాశంలో ఇంద్రధనుస్సును
ఎవరు నిలుపగలరో మళ్ళీ ఎవరు మలుపగలరో ॥ఎవరు॥

ఆకాశములో మబ్బుల గుంపును
ఎవరు చేర్చగలరో వాటిని ఎవరు మార్చగలరో ॥ఎవరు॥

# 3. వృద్ధాప్యం

దుర్భరమే దుర్భరమే దుర్భరమే
వృద్ధాప్యము ఎవరికైన దుర్భరమే
దుర్భరమే దుర్భరమే దుర్భరమే
ప్రతి మనిషికి వృద్ధాప్యము దుర్భరమే. ॥దుర్భరమే॥

కంటిచూపు కరువగును
దృశ్యమేది కనరాదు
ముందేమిటొ వెనుకేమిటొ
ఇరుప్రక్కల ఉందేమిటొ
తెలుసుకొనుట క్లిష్టమై
మనసుకెంతొ కష్టమగును. ॥దుర్భరమే॥

మంచిమాట వినరాదు
చెడ్డమాట వినరాదు
ఎవరి ఏడ్పు వినరాదు
తన ఏడ్పే తనకు కూడ
వినరాదు వినరాదు. ॥దుర్భరమే॥

తోలు ముడుత పడిపోవును
పళ్ళు రాలి పడిపోవును
చేతులలో శక్తిలేక
చిన్నపనీ చేయలేక
అడుగు తీసి అడుగు కూడ
వేయలేక వేయలేక
చితికిలబడు బ్రతుకు బరువు. ॥దుర్భరమే॥

షడ్రుచులను తినాలనే
కోర్కె మిగిలి ఉంటుంది
తిన్న నాల్గు ముద్దలేమొ
అరగకుండ ఉంటుంది
రోగాలతో నొప్పులతో
బ్రతుకు భారమవుతుంది. ॥దుర్భరమే॥

నాలుక ఆడలేక
పెదవులు కదలలేక
ఆలోచన సాగలేక
మాటలేమొ తడబడును
తడబడును తడబడును తడబడును
మనసునిండ పెను వేదన
నిండుకొనును నిండుకొనును. ॥దుర్భరమే॥

నడుము వంగిపోతుంది
నడక ఆగిపోతుంది
మనసు క్రుంగిపోతుంది
తనువులోని అణువణువున
శక్తి క్రుంగి పోతుంది. ॥దుర్భరమే॥

సుతులు సుతలు హితము కోరి
ఆత్మీయత పంచిననూ
దగ్గరుండి క్షణక్షణం
సేవలెన్ని చేసిననూ
మృత్యువును ఎదుర్కొను
శక్తి వారు పంచరుగా. ॥దుర్భరమే॥

# 4. ప్రతిభావంతులు

ఇతడే ఇతడే ఇతడే
పూజనీయుడూ మాననీయుడూ
మాననీయుడూ పూజనీయుడూ
ఇతడే ఇతడే ఇతడే. ॥ఇతడే॥

కనిపెంచిన తలిదండ్రుల
ఘనత పెంచినట్టివాడు
వంశగౌరవమ్ము కొరకు
త్యాగ ధనము పంచినాడు. ॥ఇతడే॥

సత్య నీతి ధర్మాలను
శాంతముతో పాటించుచు
జాతి జనుల నాల్కలపై
జీవించిన చిరంజీవి. ॥ఇతడే॥

నేర్చినట్టి భాషలలో
నేర్పరిలా భాషించెను
కలకాలం నిలుచునట్టి
కావ్యాలను రచియించెను. ॥ఇతడే॥

కోటి కోటి జనులు మెచ్చ
చిత్రాలను గీసి గీసి
చిత్రకళకు ప్రమాణాలు
సృష్టించిన కళాబ్రహ్మ. ॥ఇతడే॥

బండరాయి చేతబట్టి
బొమ్మలాగ మలచినాడు
బండగుండె గలవాడిని
భవునిలాగ మార్చినాడు. ॥ఇతడే॥

గానకళా విశారదుడు
పాటలెన్నో పాడినాడు
పాటలతో కోటిజనుల
పరవశింప జేసినాడు. ॥ఇతడే॥

నటన నాట్య కళలందున
జీవించెను రాణించెను
నటనలోన చక్రవర్తి
నాట్యములో ఆచార్యుడు. ॥ఇతడే॥

జాతి జనుల గుండెలలో
నిలిచినట్టి నాయకుండు
సర్వ జనుల ఆమోదం
పొందినట్టి పాలకుండు. ॥ఇతడే॥

గుడిలేని దేవుడితడు
నిజమైన దేవుడితడు
నింగి నేల ఉండుదాక
కీర్తి కలిగి ఉండువాడు. ॥ఇతడే॥

## 5. జయం మనది

జయం మనది జయం మనది
జయం మనదిరా
జనం మెచ్చ జగం మెచ్చ
జయం మనదిరా. ॥జయం॥

ధర్మముతో పాలించే
జాతి మనదిరా భరత జాతి మనదిరా
అధర్మమును ఎదిరించే
జాతి మనదిరా భరత జాతి మనదిరా. ॥జయం॥

శాంతిని కాంక్షించునట్టి
జాతి మనదిరా భరత జాతి మనదిరా
నీతిని పాటించునట్టి
జాతి మనదిరా భరత జాతి మనదిరా. ॥జయం॥

సత్యానికి జయం కోరు
జాతి మనదిరా భరత జాతి మనదిరా
విశ్వజనుల హితం కోరు
జాతి మనదిరా భరత జాతి మనదిరా. ॥జయం॥

దేశమాత రక్షణకై
ప్రాణాలర్పించునట్టి
జాతి మనదిరా భరత జాతి మనదిరా
విశ్వశాంతి స్థాపనకై
ప్రేమను బోధించునట్టి
జాతి మనదిరా భరత జాతి మనదిరా.

## 6. జాతర

జాతర ఇది జాతర
స్వామివారి జాతర
ఊరూరి జనంతోటి
సాగిపోవు జాతర. ॥జాతర॥

చదువు బాగ రావాలని
చల్లంగా ఉండాలని
కోరచేర వచ్చినట్టి
పిల్లవాండ్ల జాతర. ॥జాతర॥

కొడుకు ఒకడు కావాలని
ఆడబిడ్డ కలుగాలని
కోరచేర వచ్చినట్టి
ఆలుమగల జాతర. ॥జాతర॥

రోగాలూ రావద్దని
బాధలన్ని పోవాలని
కోరచేర వచ్చినట్టి
ముసలివాళ్ళ జాతర. ॥జాతర॥

పంటబాగ పండాలని
పాడి ఇంట ఉండాలని
కోరచేర వచ్చినట్టి
రైతన్నల జాతర. ॥జాతర॥

బేహారం బాగసాగి
లాభాలూ కురువాలని
కోరచేర వచ్చినట్టి
వ్యాపారుల జాతర. ॥జాతర॥

చక్కనైన చుక్కలనూ
చూడ చూడ వచ్చినోళ్ళ
సొగసుగాళ్ళ అందాలను
చూచి మురువ వచ్చినోళ్ళ ॥జాతర॥

కోడికూర గొర్రెకూర
కొనీ తినే వారి కొరకు
సినీమాలు సర్కసులూ
చూచి మురియు వారికొరకు ॥జాతర॥

జూదమాడి తాగి తాగి
డబ్బు ఊడగొట్టుకోని
పైస కొరకు పాడు పనులు
చేయుటకై చేరినోళ్ళ ॥జాతర॥

జాతర ఇది జాతర
స్వామివారి జాతర
ఊరూరి జనంతోటి
సాగిపోవు జాతర. ॥జాతర॥



# 7. భారతీయులం

మనం భారతీయులం ఒకేజాతి వారలం
ఒకేజాతి వారలం మనం భారతీయులం. ॥మనం॥

కనిపెంచిన పెద్దలనూ
విద్దెలు నేర్పిన గురువును
పూజించే దేశములో
పుట్టినట్టి వారలం. ॥మనం॥

కులం మతం ఏదైనా
ఆచారం ఏదైనా
ఐక్యత బహుగొప్పదనీ
భావించే వారలం. ॥మనం॥

పలురకాల భాషలనూ
భాషించే వారున్నా
భావాలలో ఏకత్వం
కలిగిఉన్న వారలం. ॥మనం॥

పలుమారులు పగవారిని
తరిమికొట్టి తరిమికొట్టి
దేశమాత రక్షణకై
పోరాడిన వీరులం. ॥మనం॥

సమత మమత భావాలను
గౌరవించి ఆచరించి
శాంతి సత్య ధర్మాలను
స్థాపించే వారలం. ॥మనం॥

# 8. ఆరోగ్యం

ఆరోగ్యము ప్రతి జీవికి
చైతన్యము నందించును
ఆరోగ్యము ప్రతి వ్యక్తికి
వివేకమును కలిగించును.

ఆరోగ్యము గలవాడే
విద్యాబుద్ధులు పొందును
ఆరోగ్యము గలవాడే
సకల సౌఖ్యములు పొందును.

ఆరోగ్యము గలవాడే
బలవంతుడు బలవంతుడు
ఆరోగ్యము గలవాడే
ధనవంతుడు ధనవంతుడు.

ఆరోగ్యము గలవాడే
సంఘములో రాణించును
ఆరోగ్యము గలవాడే
సంఘజీవి అనిపించును.

ఆరోగ్యము గలవాడే
ఆడగలడు పాడగలడు
ఆరోగ్యము గలవాడే
ఆనందము పొందగలడు.

# 9. ఎండలు

ఎండలు ఎండలు ఎండలు
మండే మండే ఎండలు ॥ఎండలు॥

సూర్యుడు భువిపై రాలినట్లుగా
మంటలు ఇలపై పరవినట్లుగా ॥ఎండలు॥

సూర్యుడె నిప్పుల మేఘమాలయై
నిప్పుల వర్షం కురిసినట్లుగా ॥ఎండలు॥

దివాకరుండే మండే కళ్ళతో
చూపుల జ్వాలలు విసిరినట్లుగా ॥ఎండలు॥

ఆకాశంలో దేవతలందరు
మంటల కుంపటి పెట్టినట్లుగా ॥ఎండలు॥

ఎండిన అడవులు మండినట్లుగా
పెట్రోలు బంకులు కాలినట్లుగా ॥ఎండలు॥

ఎండ దుప్పటి భూదేవరపై
పరవినట్లుగా పరవినట్లుగా ॥ఎండలు॥

అన్యాయాలను భరించలేక
అవనియె.అనలం పాలైనట్లుగ ॥ఎండలు॥

సురాసురులు పోరాడినప్పుడు
అగ్నిబాణములు వదలినట్లుగా ॥ఎండలు॥

రాక్షసగణము అంబరానికి
నిప్పంటించిన చందముగా ॥ఎండలు॥

# 10. చెలికాడా నీకోసం!

నీకోసం చెలికాడా నీకోసం
నింగిలోన నెలవంకగ ఉదయిస్తా
వెన్నెలతో హాయి నీకు కలిగిస్తా.

నీకోసం చెలికాడా నీకోసం
చల్లగాలినై నేనూ జన్మిస్తా
నిన్ను తాకి నీకు హాయి కలిగిస్తా.

నీకోసం చెలికాడా నీకోసం
వర్షించే మేఘమునై జన్మిస్తా
వర్షించీ హర్షమునే కలిగిస్తా.

నీకోసం చెలికాడా నీకోసం
నీడనిచ్చు వృక్షమునై జన్మిస్తా
పండ్లు ఫలములిచ్చి నిన్ను రక్షిస్తా.

నీకోసం చెలికాడా నీకోసం
నిత్యమల్లె తీగలాగ జన్మిస్తా
పూలు పూసి పరిమళాలు పంచిస్తా.

నీకోసం చెలికాడా నీకోసం
అందమైన నెమలిలాగ జన్మిస్తా
నాట్యమాడి ఆనందం కలిగిస్తా.

నీకోసం చెలికాడా నీకోసం
కొమ్మమీద కోకిలనై జన్మిస్తా
పాటలతో ఉల్లాసం కలిగిస్తా.

# 11. కోటి విద్యలు

ఆహారం ఆహారం ఆహారం
ప్రతి జీవికి కావాలీ ఆహారం.

ప్రతి జీవీ బ్రతుకుటకై స్వీకరించు ఆహారం
ప్రతి జీవీ పెరుగుటకై స్వీకరించు ఆహారం.

ఆహారం కొరకు మనిషి చెట్లనెక్క నేర్చినాడు
ఆహారం కొరకు మనిషి వేటాడుట నేర్చినాడు.

ఆహారం కొరకు మనిషి వ్యవసాయం చేపట్టెను
ఆహారం కొరకు మనిషి పలువిద్యలు చేపట్టెను.

ఆహారం కొరకు మనిషి భూమి హక్కు సాధించెను
ఆహారం కొరకు మనిషి సంపదలను సాధించెను.

యుక్తిపరుడు శక్తికొరకు ఆయుధములు ధరియించెను.
పదిమందిని అణచివేసి ఆధిక్యత సాధించెను.

శక్తిపరుడు యుక్తిపరుడు రాజ్యమునే స్థాపించెను
శాసనాలు చేసి చేసి ప్రజలనతడు శాసించెను.

కోటి విద్యలు కూటికొరకే శక్తియుక్తులు కూటికొరకే
కూటికొరకే కూటికొరకే కోటివిద్యలు కోటివిద్యలు.

# 12. పసిడి ప్రశ్నలు

కదిలేది కదిలించేది
కనబడకుండా పరుగెత్తేది
ఏదమ్మా అది ఏదమ్మా?
చెప్పుకో చూద్దాం చిట్టమ్మా!
చెప్తా చెప్తా తాతయ్యా!
వినుకో వినుకో తాతయ్యా
గాలి గాలి గాలి
గాలి కదా మరి తాతయ్యా.

పట్టుకుంటె చిక్కనిదేది?
ముట్టుకుంటె భరింపరానిది
ఏదమ్మా అది ఏదమ్మా?
చెప్పుకో చూద్దాం చిట్టమ్మా?
చెప్తా చెప్తా తాతయ్యా!
వినుకో వినుకో తాతయ్యా
మంట మంట మంట.
మంట కదా మరి తాతయ్యా.

పల్లమువైపు పరుగెత్తేది
నీలో నాలో ప్రవహించేది
ఏదమ్మా అది ఏదమ్మా?
చెప్పుకో చూద్దాం చిట్టమ్మా!
చెప్తా చెప్తా తాతయ్యా!
వినుకో వినుకో తాతయ్యా
నీరు నీరు నీరు
నీరు కదా మరి తాతయ్యా.

ప్రతి జీవికి ఆలయమై
ఆహారం పంచునదేది?
ఏదమ్మా అది ఏదమ్మా?
చెప్పుకో చూద్దాం చిట్టమ్మా!

చెప్తా చెప్తా తాతయ్యా
వినుకో వినుకో తాతయ్యా
నేల నేల నేల
నేల కదా మరి తాతయ్యా.

చరించడానికి చోటిచ్చేది
గాలి వెలుగులకు త్రోవిచ్చేది
ఏదమ్మా అది ఏదమ్మా?
చెప్పుకో చూద్దాం చిట్టమ్మా!

చెప్తా చెప్తా తాతయ్యా!
వినుకో వినుకో తాతయ్యా
నింగి నింగి నింగి
నింగి కదా మరి తాతయ్యా.

పనిచేయుచు బ్రతికేవాడు
సమత మమత కోరేవాడు
ఎవరమ్మా అతడెవరమ్మా?
చెప్పుకో చూద్దాం చిట్టమ్మా!

చెప్తా చెప్తా తాతయ్యా
వినుకో వినుకో తాతయ్యా
దేవుడు దేవుడు దేవుడు
అతడే మానవ దేవుడు.

# 13. మంచి పాట

పాట పాడాలీ మంచీ పాట పాడాలీ.
రాగయుక్తంగాను మనమూ
మధుర మధురంగాను మనమూ
పాట పాడాలీ మంచీ పాట పాడాలీ.

వినిన వారల ఎడదలందున
ఆనందం అంకురించి పల్లవించేలా మనమూ
పాట పాడాలీ మంచీ పాట పాడాలీ.

శ్రోతలందరు సంతసముతో
తన్మయత్వం పొంది పొంది మురిసిపోయేలా మనమూ
పాట పాడాలీ మంచీ పాట పాడాలీ.

పాటలెందుకు పాడుతామో
విన్నవారికి విన్నవెంటనె అర్థమయ్యేలా మనమూ
పాట పాడాలీ మంచీ పాట పాడాలీ.

పాడగానే విన్నవారికి
నవ చేతన ఎదలోపల ఎదగగలిగేలా మనమూ
పాట పాడాలీ మంచీ పాట పాడాలీ.

శ్రోతలందరు శ్రోతలందరు
ఆశ్చర్యం ఆశ్చర్యం పొందగలిగేలా మనమూ
పాట పాడాలీ మంచీ పాట పాడాలీ.



# 14. మృత్యువు

ఆగవే మృత్యువా ఆగవే
ఆగి నా మాటలను ఆలకించుము నీవు. ॥ఆగవే॥

చేయవలసిన పనులు
చేయజాలిన పనులు చేసి చూపిస్తాను చూడు ॥ఆగవే॥

పంటలను పండించగలనూ
పది మందికీ పంచగలనూ
నేను వెళ్ళిపోతె పదిమంది గతియేమి. ॥ఆగవే॥

వృక్షజాతులు పెంచగలనూ
ఫల పుష్పములు పెంచగలనూ
నేను వెళ్ళిపోతె వృక్షాల గతియేమి. ॥ఆగవే॥

చెరువులను నిర్మించగలనూ
నీటి వనరులు పెంచగలనూ
నేను వెళ్ళిపోతె చెరువుల గతియేమి. ॥ఆగవే॥

చట్టాలు నిర్మించగలనూ
రాజ్యాలు పాలించగలనూ
నేను వెళ్ళిపోతె రాజ్యాల గతియేమి. ॥ఆగవే॥

వేయి మాటలు చెప్పి
విసిగించ లేనులే
సాగిపో మృత్యువా సాగిపో.



# 15. సత్యమేవ జయతే

సత్యమే బ్రతకాలిరన్నా
సర్వదా సత్యమే బ్రతకాలిరన్నా.

మనిషి మనిషీ మధ్య
సత్యవాక్కులు సాగి సత్యమే బ్రతకాలి రన్నా
సర్వదా సత్యమే బ్రతకాలిరన్నా.

నరులు తమ బాధ్యతలు
క్రమముగా పాటించ సత్యమే బ్రతకాలిరన్నా
సర్వదా సత్యమే బ్రతకాలిరన్నా.

ధర్మ మార్గమునందు
మనుజులందరు నడువ సత్యమే బ్రతకాలిరన్నా
సర్వదా సత్యమే బ్రకాలిరన్నా.

సత్యసూత్రము మీద
దేశపాలన సాగి సత్యమే బ్రతకాలిరన్నా
సర్వదా సత్యమే బ్రతకాలిరన్నా.

విజ్ఞానశాస్త్రాలు
వర్ధిల్లవలెనన్న సత్యమే బ్రతకాలిరన్నా
సర్వదా సత్యమే బ్రతకాలిరన్నా.

సత్యమ్ము సర్వదా
విజయమ్ము పొందుటకు సత్యమే బ్రతకాలిరన్నా
సర్వదా సత్యమే బ్రతకాలిరన్నా.

# 16. మహోన్నతం

రాముడు పుట్టిన దేశం ఇది రాముడు పుట్టిన దేశం
రాముడు పుట్టిన దేశం రఘురాముడు పుట్టిన దేశం
తండ్రిమాట పాటించినట్టి రఘురాముడు పుట్టిన దేశం
రాముడు ఏలిన దేశం ఇది రాముడు ఏలిన దేశం.

సత్యం పుట్టిన దేశం ఇది సత్యం పుట్టిన దేశం
సత్యం కోసం రాజ్యం వదలిన హరిశ్చంద్రుడు పుట్టిన దేశం
సత్యం పుట్టిన దేశం ఇది సత్యం పుట్టిన దేశం
సత్యం కోసం ఆలుబిడ్డలను అమ్మిన మనిషి పుట్టిన దేశం.

బుద్ధుడు పుట్టిన దేశం ఇది బుద్ధుడు పుట్టిన దేశం
కరుణనిండిన మహానిధి బుద్ధుడు పుట్టిన దేశం
సత్యాన్వేషణ చేయుట కొరకై సతీసుతులను త్యజించి వెళ్ళిన
బుద్ధుడు పుట్టిన దేశం ఇది బుద్ధుడు పుట్టిన దేశం.

పెద్దల మాటను మన్నించాలి
నిత్యం సత్యం పల్కించాలి
మనసున కరుణను పండించాలి
ఇది మన సంస్కృతి ఇది మన సంస్కృతి
మహోన్నతం మహోన్నతం.



# 17. స్వాగతం

శిలలకే ప్రాణాలు పోసిన
శిల్పులారా! స్వాగతం సుస్వాగతం.
ఒక్కబండలో గుడిని చెక్కిన
మహాశిల్పికి స్వాగతం సుస్వాగతం.
రాతి రథములు చెక్కి విద్యకు
విలువ తెచ్చిన శిల్పులారా! స్వాగతం.
రాతిలోనే నందిబొమ్మలు
చెక్కినిల్పిన శిల్పులారా! స్వాగతం.
రాతినాతిని సృష్టిచేసిన
కళాబ్రహ్మకు స్వాగతం సుస్వాగతం.

# 18. దివ్యశక్తి

ఏదో ఒక దివ్యశక్తి నాకు సహకరిస్తున్నది
ఏదో ఒక వింతశక్తి నాలో ఉదయిస్తున్నది ॥ఏదో॥
మాటలాడు ఆలోచన నాకు కలుగజేస్తున్నది
మాటలకూ మాధుర్యం తాను అందచేస్తున్నది ॥ఏదో॥
చక్కనైన భావాలను నాకు కలుగజేస్తున్నది
భావాలను ప్రకటించే నేర్పు నాకు ఇస్తున్నది ॥ఏదో॥
పనిచేసే నైపుణ్యం నాకు అందజేస్తున్నది
ఉత్పత్తిని పెంచునట్టి శక్తినాకు ఇస్తున్నది ॥ఏదో॥
ఏదో ఈ దివ్యశక్తి నాలోనే ఉండాలని
మనిషిలాగ జీవించే కోరికనే కోరుకొందు ॥ఏదో॥

# 19. మంచి మాట

మాట కావాలీ మంచీ మాట కావాలీ
మనిషి మనిషిని కలుపగలిగే మాట కావాలీ
మంచి మాట కావాలీ.

ఎదుటివారూ నమ్మగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
జనుల సమ్మతి పొందగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
మనిషి మంచిని చాటగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
మనిషి మనసున నాటగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
మంచియన్నది పెంచగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
రాతిగుండెను మార్చగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
శ్రోతనిండుగ నవ్వగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
శ్రోతలందరు మెచ్చగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.
స్నేహభావం పెంచగలిగే మాట కావాలీ
మంచీ మాట కావాలీ.

మనిషి మనసున నిలిచియున్న కల్మషాన్ని తీసివేసి
తేట మనసును మనిషి ఎదలో పెంచగలుగాలీ
మాట కావాలీ మంచీ మాట కావాలీ.

# 19. యోచించు

మంచిగా యోచించు మనసా!
మంచిగా యోచించి మంచి పనులే చేసి
మంచి కీర్తిని పొందు మనసా!
మంచిగా యోచించు మనసా!

స్వంతలాభము కొంతమానుకోవాలని
పరుల మేలు ఎపుడు కోరుచుండాలని
పెద్దవారలు చెప్పినట్టి సుద్దులు నేర్చి
నడచుకో నడచుకో మనసా!

పశుజాతికన్ననూ మనిషి గొప్పంటారు
సర్వప్రాణులలోను మనిషి గొప్పంటారు
మనిషి గొప్పేమిటో మనిషిగా తెలుసుకొని
మసలుకో మసలుకో మనసా!

సంఘమందున నిలిచియున్నా
నీతినియమం తెలుసుకొంటూ
ధర్మబద్ధముగాను నీవు నడచుకోవాలి
మనసా! నడచుకోవాలి.

అనుభవజ్ఞుల మంచిమాటలు ఆలకించాలి
ఆలకించి ఆలకించి ఆచరించాలి
మనసా! ఆచరించాలి.

మనుజ ధర్మాలను మనిషిగా పాటించి
మనిషిగా జీవించు మనసా! నీవు
మంచిగా జీవించు మనసా!

# 21. జల గమనము

నదిపుట్టె నది పుట్టెనదిగో
కొండపై నదిపుట్టె కొండపై నదిపుట్టె
నదిపుట్టె నదిపుట్టెనదిగో.
పసి ప్రాయములో నది పొర్లాడె పొర్లాడె
పొర్లాడె పొర్లాడెనదిగో.
వయసు పెరిగినకొలది
బరువు పెరిగినకొలది
నేర్చింది నేర్చింది నది నడక నేర్చింది.
అడుగులో అడుగేసి
తప్పటడుగులువేసి
నడయాడజొచ్చింది నడయాడజొచ్చింది.
ఎత్తునుండీ తాను నేలపై దూకింది
నేలపై దూకింది గంతులే వేసింది.
నేర్చింది నేర్చింది పరుగెత్త నేర్చింది
పరుగెత్తి పరుగెత్తి పరుగెత్తి పరుగెత్తి
రాళ్ళపైకెక్కింది చెట్లపైకెక్కింది.
ఉత్సాహముతో తాను ముందుకే దూకింది
ముందుకే దూకింది పక్కలకు ఉరికింది.
అటు తిరిగి ఇటు తిరిగి
సుడులు సుడులూ తిరిగి
వడివడిగ సాగింది అదిగో
నది వడివడిగ సాగింది అదిగో.
మైదానమున చేరె నదిగో
నది మైదానమున చేరెనదిగో
పరుగెత్తె పరుగెత్తెనదిగో

పరుగులా రాణిలా పరుగెత్తె పరుగెత్తె
పరుగెత్తె పరుగెత్తెనదిగో.
నది పెరిగె నది పెరిగె
నిండుగా నది పెరిగె
వయసులో నడినాతి
నవ్వుతూ సాగింది.
ఆడుతూ పాడుతూ చురుకుగా సాగింని
కడలిబావను చూడ కాళ్ళబలమే చూపి
నడయాడజొచ్చింది నడయాడజొచ్చింది.
నడచి నడచీ తాను అలసియేపోయింది
అలసినా ఆగక ముందుకే సాగింది
మందగమనముతోను ముందుకేసాగింది
నదినారి నడకలో ఒయ్యారమొలికింది
ఒయ్యారముగ యేఱు నడయాడజొచ్చింది.
నడచింది నడచింది
చురుకుగా చూచింది
కడలిబావను చూచి
గంతులే వేసి ది
అంతలో ఆగింది
సిగ్గుతో నడచింది
సిగ్గుతో పక్కలకు
తిరిగింది నడచింది
నడచింది నడచింది నదినారి నడచింది
కడలి బావనుచేరి కరములే ఇచ్చింది.



# 22. పంట

పంట పండించాలి పంట పండించాలి
దండిగా మెండుగా పంట పండించాలి. ॥పంట॥

నాగలితో బాలుదున్ని బాలుమీద బాలుదున్ని
మరోమారు మరోమారు దున్ని దున్ని దుక్కిదున్ని ॥పంట॥

మేలురకపు విత్తనాలు క్రమముగాను విత్తివిత్తి
ఎరువువేసి కలుపుతీసి పైరుపెంచి పైరుపెంచి ॥పంట॥

శ్రమజీవులు కలసిమెలసి పనులన్నియు చేయాలి
శ్రమచేసిన ప్రతి మనిషికి శ్రమ విలువను పంచాలి ॥పంట॥

పనిచేయుచు పలుపంటలు పండించాలీ
గిడ్డంగులు ధాన్యాలతొ నిండించాలీ ॥పంట॥

కరువులలో దాచినట్టి ధాన్యాలను పంచాలి
సంఘములో దాతృత్వపు భావాలను పెంచాలి. ॥పంట॥

రైతన్నలు సంఘాలను నిర్మించాలి
కలసి మెలసి రైతన్నలు జీవించాలి. ॥పంట॥

శ్రామికులే అధికారం సాధించాలి
శ్రామికులే క్షేమంగా పాలించాలి. ॥పంట॥



# 23. ఆలోచన

అభివృద్ధి కలుగుచుండు ఆలోచనపరులకే
ఆనందం ఆవేదన ఆలోచనపరులకే.

ఆలోచన కలుగుచుండు ఆలోచనపరులకే
విజ్ఞానం పెరుగుచుండు ఆలోచనపరులకే.

వివేకమ్ము పెరుగుచుండు ఆలోచనపరులకే
మంచీ చెడు తెలియుచుండు ఆలోచనపరులకే.

రహస్యాలు తెలియుచుండు ఆలోచనపరులకే
పరిశోధన పెరుగుచుండు ఆలోచనపరులకే.

# 24. వింత కోరికలు

పక్షిలాగ మారిపోయి
నింగిలోను ఎగరాలని కోరిక ఎదలో కలిగెను.

మృగములాగ మారిపోయి
అడవిలోను తిరగాలని కోరిక మదిలో కలిగెను.

చేపలాగ మారిపోయి
చెరువులోను ఈదాలని కోరిక హృదిలో కలిగెను.

చెట్టులాగ మారిపోయి
ఫలాదులను పంచాలని కోరిక మనమున కలిగెను.

కోరదగిన కోర్కెయేది?
తీరదగిన కోర్కెయేది? మంచికోర్కె యేది యేది?

పదిమందికి మేలుచేయు
కోర్కెలన్ని కోరదగును మంచికోర్కె తీరదగును.

# 25. బలవంతుడు

బలహీనుల పట్ల కరుణ
కలిగి ఉన్న మానవుడే
భగవంతుడు భగవంతుడు భగవంతుడులే.
బలవంతుని నడవడిలో
ధర్మనిరతి ఉంటే
బలవంతుడె భగవంతుడు భగవంతుడులే.
మనసునిండ మమత ఉండి
మనగలిగే మానవుడే
భగవంతుడు భగవంతుడు భగవంతుడులే.
సత్యమ్మును అనునిత్యము
పలుకునట్టి మానవుడే
బలవంతుడు భగవంతుడు భగవంతుడులే.

# 26. పరస్పరం స్నేహితులం

భరతమాత జయం కోరి పాట మనం పాడుదాం
మాతృదేశ హితం కోరి మంచి పాట పాడుదాం.
అందరం మనమందరం సమానులం సమానులం
తల్లిభారతి పుత్రులం భావిభారత నేతలం.

మనం మనం సోదరులం మమతతోను మెలగుదాం
మతం మనది యేదైనా సమతతోను సాగుదాం,
హిందువులైనా ముస్లిములైనా క్రైస్తవులైనా
మనం మనం సోదరులం పరస్పరం స్నేహితులం.

(హిందీ కవిత ఆధారంగా)

# 27. విశ్వమంలో వింతలు

ఆకాశం వైపుచూడు తమ్ముడూ
దానికి అంతులేదు హద్దులేదు తమ్ముడూ
ఎన్ని పాలపుంతలో ఎన్నికోట్ల చుక్కలో
అంతులేని ఆకసాన ఎన్నివేల వింతలో ॥ఆకాశం॥

సౌరకుటుంబాలు ఎన్ని ఉన్నవో
చెప్పమనకు తరముఃగాదు తమ్ముడూ
మండుచున్న నిప్పుముద్ద తమ్ముడూ
దానినే సూర్యుడందురందరూ ॥ఆకాశం॥

రవిచుట్టూ తిరుగుచుండు తమ్ముడూ
గ్రహములెన్నొ ప్రతిక్షణం తమ్ముడూ
చిన్న చిన్న ఉపగ్రహాలు ఎప్పుడూ
గ్రహాలచుట్టు తిరుగుచుండు తమ్ముడూ ॥ఆకాశం॥

చుక్కచుక్కమధ్యనుండు దూరమూ
మామూలుగ చెప్పలేము తమ్ముడూ
ఆ చుక్క పరిమాణం ఈ చుక్క పరిమాణం
ఒక్కలాగ ఉండదురా తమ్ముడూ ॥ఆకాశం॥

కాంతులు వెదజల్లేవి చుక్కలూ
వెలుగులు ప్రతిబింబించేవి గ్రహములూ
పరిశోధన కందలేని వింతలూ
విశ్వములో ఎన్నొగలవు తమ్ముడూ ॥ఆకాశం॥

గాలి నీరు ఆహారం కలిగిఉంది భూగోళం
వృక్షాలను జంతువులను కలిగిఉంది మనగోళం
ఆలోచన కలిగిఉన్న మన నరుడే
రహస్యాలు తెలుసుకొనుచు మనుచుండే ॥ఆకాశం॥

## 28. చుక్కల దృశ్యం

మెరిసే చుక్కలు మెరిసే చుక్కలు
చక్కని చుక్కలు చిక్కని చుక్కలు
చూచేవారికి సుందరమే కద
సుందరమే కద చుక్కల దృశ్యం.
అవనికి దూరం అవి ఉన్నా
అనంత దూరములోనున్నా
ముత్యాలే అనిపించేటట్లుగ
మెరియునులే ఆ చక్కని చుక్కలు.
అధిక కాంతులను పంచే చుక్కను
ధ్రువతార అని మనము అంటాములే
దృఢ సంకల్పం కలిగిన వారలు
ధ్రువతారలా కీర్తి పొందేరులే.
తారలలో ఆ చందురుడూ
కనిపించునులే అందముగా
మంచి నడవడి కలిగిన మనుజుడూ
కనిపించునులే అందముగా.

## 29. ఇరుగు పొరుగు

మా ఇంటికి కుడివైపున నివసించే ఇంటివారు
గడబిడ అది చేయకుండ నెమ్మదిగా మెదలుతారు.
ఎడమవైపు ఇంటివారు దడదడమను శబ్దమ్ములు
పగలు రాత్రి సృష్టించుచు కేకలతో గడుపుతారు.
మరో ఎడమ ఇంటివారు బిగ్గరగా పాడుతారు
ఆశ్చర్యము కలుగునట్లు పగులబడీ నవ్వుతారు
కుడిదూరపు ఇంటివారు ఆసక్తి కలుగునట్లు
రహస్యాలు ఏవేవో గుట్టుగ మాట్లాడుతారు.

# 30. కన్నతల్లి

కదలిపోయె కదలిపోయె కదలిపోయెనమ్మా
కానరాని లోకానికి కదలిపోయెనమ్మా. ॥కదలి॥

కన్నతల్లి కల్పవల్లి కదలిపోయెనమ్మా
కన్నుమూసి నాకానికి కదలిపోయెనమ్మా. ॥కదలి॥

పది నెలలూ ననుమోసీ కనిపెంచిన తల్లీ
కనిపించిన ఆ దేవత కనుపించదు మళ్ళీ. ॥కదలి॥

మాటలలో సుధలునింపి జోలపాట పాడెతల్లి
పాలబువ్వ ముద్దలతో కడుపు నింపినట్టి తల్లి. ॥కదలి॥

బడి చూడని ప్రాయమందు ప్రథమ గురువు నా తల్లీ
సంస్కారము నూరిపోసి పెంచినట్టి నా తల్లీ. ॥కదలి॥

క్రమశిక్షణతో పెంచిన నేర్పరి నా తల్లీ
నేర్పగలిగినట్టి విద్య నేర్పిన నా తల్లీ. ॥కదలి॥

నా బాధను తన బాధగ భావించిన తల్లీ
నా బాధను తొలగించగ కృషిచేసిన తల్లీ. ॥కదలి॥

చీకటిలో వెలుగులనూ కల్పించిన తల్లీ
జీవితాన వెలుగులనూ కురిపించిన తల్లీ. ॥కదలి॥

(కన్నతల్లిని కోల్పోయిన ఒక అభాగ్యుని ఆవేదన)



# 31. తనివి తీరదు

ఎన్నిపాటలు రాసినా ఎన్నిపాటలు పాడినా
తెలుగు శారద సేవచేస్తూ ఎంతకాలము గడపినా
మనసు మురియును తనివి తీరదు ఎందుకో మరి ఎందుకో ॥ఎన్ని॥

గేయ కవితలు రాసినా వచన కవితలు రాసినా
పాదపాదమునందు శారద సేవనేనే చేసినా
మనసు మురియును తనివి తీరదు ఎందుకో మరి ఎందుకో ॥ఎన్ని॥

రాసినట్టి పాటలెన్నో పత్రికలలో వచ్చినా
రాయవలెనను నాదుకోరిక తరగదెందుకు పెరుగునెందుకు? ॥ఎన్ని॥

గాయకులు నా పాటలెన్నో తీయగా వినిపించినా
చిత్రకారులు పాటపాటకు చిత్రాలు చక్కగ గీసినా ॥ఎన్ని॥

వందలాది జనుల ఎదుట ఆదరమునే పొందినా
మంచి మనసులు మెచ్చినా సమీక్షలెన్నో వచ్చినా ॥ఎన్ని॥

కొత్త నవలలు రాసినా పెద్ద కథలే రాసినా
ఖండ కావ్యములందు శారద సేవనేనే చేసినా
మనసు మురియును తనివి తీరదు ఏలనో మరి ఏలనో ॥ఎన్ని॥

ఎన్నిపాటలు రాసినా ఎన్నిపాటలు పాడినా
తెలుగు శారద సేవచేస్తూ ఎంతకాలము గడపినా
మనసు మురియును తనివి తీరదు ఎందుకో మరి ఎందుకో ॥ఎన్ని॥

(ఈ పాట ఒక రచయిత మానసిక స్థితిని ఆవిష్కరిస్తున్నది)

# 32. కరుణ

కరుణ కలిగి నీవు ఉంటె కరుణ నీవు పొందగలవు
కరుణ శక్తి తెలుసుకొనుము కరుణ నీవు పెంచుకొనుము. ॥కరుణ॥

కరుణతోనె కఠిన ఎదలు కరిగిపోవులే
కరుణ పంచి నీవు కరుణ పొందవచ్చులే. ॥కరుణ॥

కరుణ ఎదలో పొంగినపుడె మనిషి మహిమ పెరుగు
కరుణతోనె మనిషి మహా మనీషియగునులే. ॥కరుణ॥

కరుణ ఉన్న ప్రతి మనిషి ప్రతి మనిషికి దేవుడు
దేవుడెవరు దేవుడెవరు? కరుణ ఉన్న మానవుడే. ॥కరుణ॥

కరుణ కరుణను ఆదరించును
కరుణ కరుణను కనికరించును
కరుణ కరుణకు కనిపించును
కరుణ కరుణను కనిపెంచును. ॥కరుణ॥

కరుణ కరుణలో ఒదుగును
కరుణ కరుణలో కరుగును
కరుణ కరుణలో దాగును
కరుణ కరుణలో పెరుగును. ॥కరుణ॥

కరుణ ధర్మమును పంచును
కరుణ న్యాయమును పెంచును
కరుణ సత్యమును పంచును
కరుణ స్నేహమును పెంచును. ॥కరుణ॥

# 33. సాగరయానం

సాగరయానం చేయరండి చేయరండి
అంతులేని సాగరమున
వింతలెన్నొ కనుగొనుటకు
సాగరయానం చేయరండి చేయరండి. ॥సాగర॥

రకరకముల జలచరముల
ఉనికి మనము తెలుసుకొనుచు
ప్రయోగాలు చేయుటకై
ఫలితాలను పొందుటకై. ॥సాగర॥

రత్నాలకు ముత్యాలకు
సాగరమే ఆకరమట
విలువనిచ్చు సంపదలను
మూటగట్టి తెచ్చుటకై ॥సాగర॥

సాగరగర్భమున ఎచట
ఖనిజమ్ములు లభ్యమగునో
సమాచార సమస్తమును
సంగ్రహించి తెచ్చుటకై. ॥సాగర॥

సాగరమున పెరుగుచున్న
ఆహారపు నిలువలకై
నిలువలలో విలువలెన్నొ
పరిశోధన చేయుటకై. ॥సాగర॥

o—◯—o